గూర్చి విని దక్షిణేశ్వరమున గలిసికొని మిక్కిలి సంతసించెను. అంత నరసు శ్రీరామకృష్ణుని చెంతకు జనుచుండు నీ యువకుడు విశ్వాస, పవిత్రతలతోనుండు శ్రీరామకృష్ణదేవుని ప్రేమను; స్వార్థ పూరితమును, కల్మషయుక్తమునగు లౌకికుల ప్రేమను గల వ్యత్యాసముల గ్రహించి, గురుదేవుని ప్రేమకు కన జనని ప్రేమకూడ సాటిరాదని విశ్వసించి, ఆ ప్రేమోదధి గ్రుంకుచు, గురు ప్రబోధితుడై, సాధనల జేయుచు, గురు అనుగ్రహ ప్రసారముచే సాధనాటంకముల నిర్మూలనము గావించుకొని, ఆనందానుభూతి నోలలాడ తీవ్ర కృషి సల్పుచుండెను. ప్రపంచ కల్మషములులేని పవిత్ర హృదయుడగుటచే నితడు శ్రీ రామకృష్ణదేవుని సమాధ్యవస్థ ల నాయనకెట్టి అపాయమురానీయక అండగా నుండెడివాడు. ఏ లేశమాత్ర దోషము పడుచున్నను, శ్రీ రామకృష్ణదేవుడు సమాధిసమయముల వారి స్పర్శను సహింపజాలడు. కావననితని ఉత్కృష్ట నిర్మలత్వ మనకు వ్యక్తమగుచున్నది. శ్రీ రామకృష్ణదేవుని వ్యాధిలో శుశ్రూషల గావించుచు, ఆ ప్రేమమూర్తి అస్తమింప నీయువకుడును, ప్రాపంచిక విషయముల గాలదన్ని, గురుదేవుని ఆదర్శముగగొని, సరమును త్యజించి శ్రీ ప్రేమానంద స్వామియను నామధారి యయెను. పరివ్రాజక జీవితమున నుండుచు, సాధనలజేయుచు గొంతకాలమునకు మఠమునకు జేరెను. శ్రీ వివేకానందుని మరణానంతరము మఠ కార్యక్రమముల నతి శ్రద్ధమై నిరహించెడివాడు. పవిత్రత రూపొందిన ఆతని మూర్తిమత్త్వము, ప్రేమనిలయమగు నాతని హృదయము, హృద

యమే బహి తమై ప్రవహించుచున్నదో యనునట్లుండు నాతని వచనములు, ప్రేమను జిందించు నాతని చూడ్కులు ఎట్టివానినైన బాదాక్రాంతుని జేయక మానవు. సాశ్రు నేత్రుడై వాక్కుచేగాక హృదయముతో బోధించును. పన్నా సహోదర బృందముపై నాతని ప్రేమ అత్యద్భుతము, అమానువము. శిషు లపై నాతని ప్రేమవాత్సల్యము లమోఘములు. అనవరత మాతడు సోదరశిషు ల ఆరోగ్య మును అభివృ నే గాంక్షించు ఉదార హృదయుడు. ఇట్టి ప్రేమ స్వరూపుడు 1918 జులై మాసమున నీ స్థూల శరీరమును బాసి 'న స పునరావర్తతే' అను శ్రుత్యుక్తముగ బునర్జన్మ రహిత మోక్షమున బ్రవేశించెను.

## బ్రహ్మానంద స్వామి

బీహారు దేశమున నొక నిరుపేద కుటుంబమున జనన మొంది, 5వ వత్సర ప్రాయమున జననీ జనకులు మరణింప, ఇ ర బంధువొకనిచే గలకత్తకు దీసికొనిరాబడిన బాలుడు కక్తురాం లేక లాటూ. 9, 10 వత్సరములు వచ్చుటతో నా బాలుని యాతని బంధువు ఒకరి గృహమున సేవకునిగా నియమించెను. శ్రీ రామకృష్ణ గురుదేవుని పాదసన్నిధి జేరి, గురుదేవుని అమూల తా గమును దన జీవితమున మేళవింపు జేసికొని, గురు వచనముల వేదవాక్కులుగ స్వీకరించి, వాని జీవితమున ననుష్ఠించి, శ్రీ రామకృష్ణ పరమహంస దేవుని గృహ శిష్యులలో నాదర్శ వ్యక్తియై చెలువొందిన రామ చంద్రదత్తయే ఆ గృహస్థు. అట్టి పరమ భక్తుని గృహమున

మన లాటూ సేవకుడు. అదియే భగవదనుగ్రహము. ఎవ్వని యభివృద్ధికి ఏది ఎట్లు సమకూడునో దెలియరాదుగదా! బాల్యమునుండియు మన లాటూ ఎచ్చటనైన సంకీర్తనము నాలకించినచో దానిచే నాకృష్టుడై, చేయు పనుల విస్మరించి అచ్చట కేగెడివాడు. బాలుడైనను ఆ సల్లక్షణముల గాంచి రామచంద్రదత్త కుటుంబమువారును లాటూ నధికముగ ప్రేమించెడివారు. ఆ బాలుని సత నిరతికి వారు ఆనందించెడివారు. శ్రీరామకృష్ణుని భక్తుడగు రామచంద్రదత్తుని పవిత్ర ప్రవర్తనము, అతని పవిత్ర గృహ వాతావరణము, గృహమునందలి భక్తి సంభరిత సంభాషణములును లాటూయొక్క అభివృద్ధికి సహాయభూతము లగుచుండెను. అంతియగాక వన్నిటికంటెను బాలునకు శ్రీరామకృష్ణదేవునకు గలిగిన సంబంధమే యిట ముఖ్యము. ఈ బాలునిచే రామచంద్ర కుటుంబమువారు శ్రీరామకృష్ణదేవునకు ఫలాహారముల దక్షిణేశ్వరమునకు బంపెడివారు. వాని నటకు గొంపోయిన లాటూ శ్రీరామకృష్ణుని గాంచి, ఏదియో తెలియని ఆకర్షణమున మునింగి, అవ్యక్తమగు నానందము ననుభవింపసాగెను. ఒక పర్యాయము శ్రీరామకృష్ణుడు తన జన్మభూమియగు కమార్పుకూరునకు వెడల లాటూ దక్షిణేశ్వరమున కేగి తల్లిని బాసిన శిశువుచందమున విలపించుచు నావేదన మొందెను. శ్రీరామకృష్ణుడు దక్షిణేశ్వరమున కేతెంచుటతోడ లాటూకు శ్రీరామకృష్ణ సాంగత్య మధికమై, తత్ప్రభావమున నాతని సన్నిధినుండ నా యమాయక హృదయము గాంక్షించెను. అంత నొకనాడు లాటూ మెల్లన తన యజమాని యగు

రామచంద్రునిజేరి తన గోరికను నివేదించెను. రామచంద్రుడును దక్షిణేశ్వరమున రామకృష్ణుని దర్శింప 'లాటూనక్కడనే ఉండనిమ్ము. నిర్మల హృదయుడు' అని శ్రీరామకృష్ణుడును దనతోడ బలుక నాతడు వల్లెయని యంగీకరించెను.

నాటనుండి మన లాటూ శ్రీరామకృష్ణ పాదసన్నిధిని వసించుచు, గురుబోధల నాలకించుచు, సంశయ రహితుడై శ్రీవసాధనల మునుంగుచు, గురువిశ్వాసముచే విద్యాగంధము లేనివాడయ్యు ను అనుభవానందమూర్తియైయొప్పె. శ్రీ రామకృష్ణ నిర్యాణానంతరము శ్రీ అద్భుతానంద స్వామిగానై చెలువారెను. ప్రథమమున నద్భుతరీతి రామచంద్రుని గృహమున సేవకునిగజేరి, అట నద్భుతముగ శ్రీ రామకృష్ణదేవుని సాంగత్యము గలిగి, శ్రీరామకృష్ణుని అనుగ్రహ వీక్షణా ప్రసారములచే నద్భుతముగ నాధ్యాత్మిక పథానువర్తియై పరిఢవిల్లి, పారమార్థికానందమున మునింగి, లోకమున కొక అద్భుతాదర్శమును రూపించిన మన లాటుకు వివేకానందుడొసంగిన యద్భుతానంద నామ మెంతయు నద్భుతమును సార్థకమును అనుట కెట్టి సంశయమునులేదు. యథార్థమున నతని జీవిత మద్భుతమే! అందుచేతనే 'మా గురుదేవుడైన శ్రీ రామకృష్ణుని యద్భుత పారమార్థిక శక్తుల గ్రహింపదలచినచో మమ్ముగాక అద్భుతానందులను జూడుడు' అని వివేకానందుడు అద్భుతానందునిగూర్చి సగర్వముగ వచించియుండెను. ఇట్టి యద్భుతానందుడు శ్రీ శారదాదేవితో ... యాత్రల సేవించియు, అమాయక నిరల ప్రేమచే సచ్చి... కాన దమును జేకూర్చియు, క్రమబద్ధముగ సాధనల సలుపు...

సంగమాపుడై, సంఘవిమారుడై, అనికేతనుడై 'సర మ
గురుదేవుడే' యను దృఢ విశ్వాసమున నుండువాడు. సోదర
నాయకుడగు వివేకానందుని అధికముగ ప్రేమించు మన
స్వామి 'విద్య లేకున్నను శ్రీరామకృష్ణదేవుని స్పర్శామాత్ర
మున నుత్తమ జ్ఞానము నాస్వాదించెను' అని శ్రీ వివేకానందు
నిచే గౌరవింపబడెడివాడు. మరియు ప్రాపంచిక ధనమున
పేదయయ్యును మన యద్భుతానందుడు ఆధ్యాత్మిక జ్ఞాన
మున ధనికుడై, తత్ఫలితముగ గొప్ప మేధావంతులు తత్త్వ
వేత్తలు తన పాదములచెంత నున్నను నిరహంకారియై, పూరి,
కాశీ, అలహాబాద్, బృందావనాది పుణ్యస్థలముల నేకాంత
ముగ నుండుచు, దపో నిరతుడగుచు, సర్వాఘ నివారణమగు
వారణాశీ బవిత్రక్షేత్రమున 1920 ఏప్రిల్‌లో యీ ప్రపంచ
రంగమునుండి నిష్క్రమించిన నిర్మల నిర్లిప్త ధ్యానయోగి,
శ్రీరామకృష్ణదేవుని అపూర్వ శిష్యరత్నము. 'శాస్త్రతో
గురుతశ్చైవ స తశ్చైవ త్రి సిద్ధయః' శాస్త్ర, గురు, స త
స్సిద్ధములుగ సిద్ధి త్రివిధముగ శాస్త్రము బోధించినది. అందు
శాస్త్ర స్వతస్సిద్ధముల దీసినచో శేషించునది గురుసిద్ధియే
గదా! అట్టి గురనుగ్రహసిద్ధి బొందినవాడీ యద్భుతానంద
యోగివరేణ్యుడు.

## శ్రీ తురీయానంద స్వామి

నియమనిష్ఠాచారపరులగు బ్రాహ్మణ కుటుంబమున
1863 జనవరి మాసమున జనించిన హరినాథ ఛటోపాధ్యాయ
చిన్నతనముననే దల్లిదండ్రుల గోల్పోయెను. బాల్యమాదిగ

త్రికాల స్నానము, గీతా పారాయణము, స్వయంపాకము మున్నగు నియమముల సక్రమలీల పాటించుచు, గీత, ఉపనిషత్తులను, శ్రీ శంకరాచార్యుల గ్రంథావళి దీక్షగా పఠించు వాక్షి బాలుడు. 13, 14 వత్సర ప్రాయమున నితడు ఒక బంధు గృహమున కేతెంచిన శ్రీరామకృష్ణ పరమహంస దేవుని వీక్షించి, 'ఏమి! ఈతడు శుకతుల్యుడుగనుండెనే! శాస్త్రముల దా గియగు శుకదేవునిగూర్చి పఠించితిని కాని నేడు గాంచితిని' అని ఆశ్చర్యమును బొందెను. తదుపరి 2, 3 వత్సరము లట్లే దొర్లినవి. అనంతర మాతడు శ్రీరామకృష్ణుని దర్శించి, కొలవుదినముల ప్రబతేకముగ రామకృష్ణునిజేరి, అనేక అమూల సాధన విషయముల, తత్త్వవిషయముల శ్రవణము జేయుచుండెను. ఆతని తీవ్రవేదాంత శాస్త్ర పఠనమును దిలకించి, సర్వవేదాంతానుభవముల గ్రోలిన శ్రీరామకృష్ణదేవుడొక పరా యము, సాధనల మునిగి అనుభవము గాంచుట కాతని బుద్ధిని పరిణమింపజేయుటకో యనునట్లు 'హరీ! వేదాంత శాస్త్రాధ యనము గావించుచుంటివి గదా! ఆనందము. 'బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్య' యనియే గదా తత్త్ర శాస్త్రము బోధించును! అట్లయిన నీవు అనిత్యమగు నీ ప్రపంచ త్యాగమొనరించి నిత శుద్ధ బుద్ధముక్త బ్రహ్మము నేల పొంద యత్నింపవు?' అని చిరునగవు మోమున దీపింప నాతని హెచ్చరించెను. నాటనుండి హరిప్రసన్నుడు తీవ్ర ఆరాధనా సంభరితుడై శ్రీరామకృష్ణ ఉపదేశానుసారము సాధనావిధుల మున్గి, బ్రహ్మానందమును పొంది తరా శ్రీ తురీయానంద స్వామియై తనరెను.

అంత శారదచారియై తీర్థయాత్రలజేయుచు, అందందు దపస్సు గావించుచున్న మన స్వామి దృష్టి మరల సోదర శిష్యులపై బ్రసరింప గలకత్తకు జేరి, మఠమున బ్రసంగముల పలుకుచు, గీతాది గ్రంథముల బోధించుచు, ధ్యానాదుల మునుంగుచుండెను. అట్టి సమయమున వివేకానందుడు పాశ్చాత్య ఖండమున వేదాంత ప్రచారము సాగించుచు, అటకు రా తురీయానందు నాహ్వానించెను కాని భగవద్దర్శనమే తన జీవిత గమ్యమునుగా నిశ్చయించుకొనిన తురీయానందు డందులకు సమ్మతింపక నిరాకరించెను. పిదప వివేకానందుడు గలకత్తకు దిరిగివచ్చెను. ప్రేమపూరిత హృదయుడైన వివేకానందుడు సర్వవిషయముల నాతని కెరుకపరచి, అతని గాఢముగ గాగిలించి 'హరిభాయి! మృత్యువాసన్న మగువరకు నా జీవిత సర్వస్వమును గురుదేవుని సందేశ వ్యాప్తికై అర్పించుట నీవు గాంచుటలేదా? ఈ భారమున నిసుమంత భాగమునైన నీవు వహింపక సాక్షివలె జూచుచుందువా' యని సాశ్రునయనుడై, హృదయము కరిగి ప్రవహించునట్లు వచింప, నా ప్రేమకు దాసుడైన తురీయానందుడు 1899 ఆగస్టులో నమెరికాకు వెడలి విస్తృతముగా వేదాంత ప్రచారమొనర్చెను. 'నేను బోధించు వాడను మాత్రమే. కాని ఆచరించి చూపగల నా సోదరుని ద్వారలో విూరు గాంచగలరు' అని అమెరికా నగరమున వివేకానందునిచే జేర్కొనబడిన సోదరుడే మన తురీయానందుడు. 1902 లో దిరిగి గలకత్తకు జేరియు మన స్వామి ఉత్తరభాగమున దపస్సు జేసికొనుచు, అనవరత జగన్మాతృ స్మరణాను

కర్తుడై, అంతర్ముఖుడై మనుచు, కాశీయందుగల శ్రీ రామ కృష్ణ సేవాశ్రమమున గురుధ్యానపరుడై 1922 జులైలో బరమపదించెను.

## ౨ సుబోధానంద స్వామి

తత్త్వజ్ఞానాసక్తియు, భక్తి శ్రద్ధలును గల దంపతుల గర వాసమున శంకరఘోష్ వంశోద్ధారకుడుగ సుబోధ్ చంద్రఘోష్ 1867 న గలకత్తయందు ఉదయించెను. బాల్యమునుండి జనని ద్వారా రామాయణ మహాభారత గాథలను, ఇతర శాస్త్ర విషయములను శ్రవణము జేయుటచే గాఢ భగవద్భక్తియు, సత్యార్థమగు ప్రేమయు నీ బాలుని చేత హృదయమున నాటుకొనెను. గృహస్థజీవన మభిలషింపక త్యాగజీవితమునే గాంక్షించు నీ బాలకుడు, ఒక దినమున దండ్రి బఠించుచున్న The Teachings of Sri Ramakrishna 'శ్రీ రామకృష్ణ ఉపదేశము'లను బెంగాలీ గ్రంథమును జూచుట దటంచెను. దాని జదివిన నాటనుండి సుబోధ చంద్రుడు రామకృష్ణ దేవుని జూచు కుతూహలమున దండ్రిని బాడ రమ్మ నిగోరెను. కాని తండ్రి జాగుచేయుట గాంచిన సుబోధుడా యాలస్యమును భరింపజాలక నొక స్నేహితు తో దక్షిణేశ్వరమున కేగెను. శ్రీ రామకృష్ణ పరమ హంసయు నా బాలుని అధిక ప్రేమ వాత్సల ముల వీక్షించి, తన ప్రక్కపై గూర్చుండబెట్టుకొని, కొలది నిమిషములు ధ్యానమున నుండి 'నీవు ఆధ్యాత్మిక గమ్యమును జేరగలవని జగన్మాత నాకు దెలియజేసిన' దని వచించెను. కల్లకపటము

ఎఱుగని స్వభావముగల మన సుబోధుడచిర కాలముక
శ్రీ రామకృష్ణదేవుని ప్రేమానుగ్రహములకు బాత్రుడై,
గురుదేవుడు బోధించు విధమున సాధనల నొనరించుచు,
నాధ్యాత్మిక దివ్య తేజోస్వరూపుడును, పారమార్థిక సంప
ద్విభూషితుడు నగు శ్రీ రామకృష్ణదేవుని సన్నిధి నను
భూతుల నార్జింప 'పురుషకారేణ ప్రయత్నేన' అనుకీతి
దీక్ష యత్నమును జేయసాగెను. అట్టి సమయమున శ్రీ రామ
కృష్ణు డొక దినమున 'సుబోధ్! నీవు మహేంద్రనాథ గుప్తను
జూచియుంటివా? నీ తీరిక సమయముల నాతనివద్దకు వెడలు
చుండుము' అని బలుక, వెంటనే నిష్కపటియు, గృహా శ్రీ
తము సేవగించువాడును అగు సుబోధుడు గంభీరముగ 'తన
సంసార బంధమును ఛేదింపలేని అతనినుండి నే నేమి గ్రహిం
తును?' అని సమాధాన మొసంగెను. గురుదేవు డా సమా
ధానమును ఆలకించి ఆ బాలుని త్యాగజీవిత అభిలాషకు పరి
తానందమున నుండెను. ఆ బాలుని ఉత్కృష్టాదర్శమును
గాంచి ఉప్పొంగెను. యథార్థముగ శిష్యుని శ్రేయమును
గోరు గురువున కదియేగదా ఆనందదాయకము!

శ్రీ రామకృష్ణుని మహాసమాధి యనంతరము స
సంగ పరిత్యాగియై యతడు శ్రీ సుబోధానంద స్వామి
యయ్యెను. అందరిలో చిన్న వయస్కుడగుటచే, వివేకా
నందుడు సుబోధానందుని 'ఖోకా' అనగా బాలకా అని
పిలిచెడివాడు. సోదర శిష్యులును అతని 'ఖోకా మహరాజ్'
అనియే బిలువసాగిరి. సన్న్యసించిన పిమ్మట ఓంకార్,
గిరినార్, బొంబాయి, ద్వారక, బృందావనాది పుణ్యక్షే

ములు బరటించుచు, అచ్చటచ్చట సాధనల నొనర్చెను. అంతటితో దృప్తి వహింపక కేదార్ బదరీల రెండు పర్యాయముల దర్శించెను. దేశముల దిరిగి దిరిగి కలకత్తకు జేరిన సుబోధానందుడు మృదుహృదయుడగుట సేవాశ్రమ కారములు నిరహించుచు, ఆర్తుల రక్షించుచు, సర్వవేళల బాలకునివగిది సంతోషాంతరంగుడై, ఎల్లర నానందవార్ధి ధిముంచుచు నిష్కామ కర్మయోగిగా రాజిల్లెను. కాంక్షారహితుడై, మానావమానముల సరకుగొనని అనవరత భగవన్నామానురక్తుడగు మన సుబోధానంద స్వామి 1932 డిశంబరులో నీ యశిత శరీరమును వీడి బ్రహ్మములో నైక్యము నొందెను.

## శ్రీ శివానంద స్వామి

దానధర్మ లుడును, గౌరవకుటుంబీకుడును, శ్రీరామకృష్ణ పరమహంసదేవునికి బరిచయుడునైన రామకనాయి ఘోషాలునికి కుమారునిగా 1850-60 మధ్యలో గలకత్తాయందు తారకనాథ్ ఘోషాల్ జననమొందెను. పసితనమాదిగ విద్యాసక్తియు, ధ్యానాభిలాషయు గల యాతడు కాలాంతరమున బ్రహ్మసమాజమున బ్రవేశించెను. తాను వాంఛించిన సమాధి నెంత కాలమునకు బొందకపోవుటచే మిగుల జింతించెను. విద్యాభ్యాసము ముగించి ఉద్యోగార్థమతడు ఢిల్లీకి వెడలెను. అచ్చట నొక మిత్రునివలన నిత్యసమాధి సంయుత యోగిపుంగవుడగు శ్రీ రామకృష్ణదేవునిగూర్చి విని, ఆనం

దించి గలకత్తకు దిరిగివచ్చెను. అంత రామచంద్రదత్త గృహమున ప్రథమమున రామకృష్ణుని గాంచి తారక నాథుడు సంతసించెను. మరియు దాను గోరు సమాధి గూర్చియే నాటి శ్రీ రామకృష్ణ ప్రసంగమగుట నిక నాతని యానందమున కంతులేదు. తదుపరి దక్షిణేశ్వరమేగిన మన తారకనాథుడు రామకృష్ణుని తన స్వంత జననిగ గాంచి, సన్నిహిత సంబంధము నేర్పరచుకొనెను. 'సాకార నిరాకార ములలో దేని నభిలషింతు?' వని రామకృష్ణునిచే ప్రశ్నింపబడిన తారకుడు 'నిరాకారమునే' యని తన శుద్ధ అద్వైత జ్ఞానాకాంక్షను వెల్లడించెను. వివాహమైనను విషయ దూరుడై, జ్ఞానాన్వేషియై, రామకృష్ణుని ఆదేశానుసారముగ సాధనల జేయుచుండెను తారకనాథుడు.

అట్టి సమయమున శ్రీరామకృష్ణుడు వ్యాధి గ్రస్తుడాయెను. తారకుడును అహర్నిశముల శ్రీరామకృష్ణుని సేవల నున్నచుండ నాతని భార్య యు మృత్యువాతబడెను. బంధము తీరినదని దలంచుచు దారకుడు గృహమునకేగి సన్న్యాసమును గొనుటకు దండ్రి నడిగెను. ఆ తండ్రియు మిగుల నానందించి, పూజాగృహమున గల భగవానునికి వందనముజేయ నాజ్ఞ నిడి, గన్నుల నీరు నించుచు, గద్గద కంఠముతో బుత్రుని శిరమున హస్తమునునిచి 'నాయనా! నేను బ్రపంచత్యాగ మును జేయ ప్రయత్నించితినిగాని అది నెరవేరలేదు. నీవై నను త్యాగివగుచున్నందుల కెంతయు నాకు ఆనందము కలుగు చున్నది. నీవు తప్పక భగవదనుగ్రహమును పొందెదవుగాక!'

యని ప్రేమ వాత్సల ములతో, నిండు హృదయముతో
దనము నాశీర దించి శ్రీరామకృష్ణు సన్నిధికి పంపెను.
'తండ్రి హరిజేరుమనియెడితండ్రి తండ్రి' అను భాగవతవాక్య
హాతినియందు మూర్తీభవించి ధన్యుడయ్యెను. అట్లు దండ్రి
మను మ బొందిన తారకుడు గురుదేవుని కీ విషయమును
తెలియజేయ రామకృష్ణదేవుడును ఆనందించి తన శిష్యరత్న
మును ఆధ్యాత్మికానుభూతుల నొందమని మనసార ఆశీర్వ
దించెను. రామకృష్ణ పరమహంసదేవుడు దేహమును వీడిన
మ్మట నీ తారకనాథ ఘోషాల్ యతియై శ్రీ శివానంద
స్వామియై చెలువొందెను. ఈ మన శివానందుడు 'ఇట్టి
ప్రకార వ్యక్తి నెచ్చటను గానము' అని శ్రీ వివేకానందునిచే
ప్రశంసింపబడి 'మహాపురుష' నామమున దనరొందెను.
ఈ స్వామి బరివ్రాజకుడై అనేక దేశముల బర్యటించి
బొంబాయి, నాగపూర్ మున్నగు స్థలముల నాశ్రమముల
గావించియు, శ్రీ రామకృష్ణ మఠమునకు శ్రీ బ్రహ్మానంద
స్వామి యనంతరము అధ్యక్షపదవి నలంకరించియు మఠ కార్య
క్రమముల సక్రమరీతి నిరహించెను. ప్రేమ తొణికిసలాడు
యు హృదయమునుండి పొంగిపొరల, శిష్యులకు శిక్షణము
నొసంగుచు 'కరకు పునాదిగ థా నాదులు గావలయు'
ని నిష్కామ కర్మమార్గ ప్రబోధమును గావించుచు, సర్వుల
ప్రేమతో దిలకించుచు, సర్వుల ప్రేమాదరముల జూరగొని
యా మహనీయుడు 1934 ఫిబ్రవరి మాసమున రామకృష్ణ
దేవు సాన్నిధ్య మును జేరుకొనెను.

# శ్రీ అఖండానంద స్వామి

పూర్వాచారముల బాటించు బ్రాహ్మణ వంశము గంగాధర ఘటక్ జనించెను. బాలమునుండియు గంగాధరుడు స్నాన, అధ్యయనాదికముల నియమముతోడ జేయు నాధ్యాత్మిక జిజ్ఞాసాపరుడై యుండెను. ఆ జ్ఞానాసక్తితో 1884 లో హరినాథునితో గూడ దక్షిణేశ్వర మరుదెంచెను. తరచు శ్రీ రామకృష్ణునితో సంబంధము గలుగుటచే బాల్యక్రమముగా బాహ్యాచార నియమముల బాటించు ధోరణి త అంతర్దృష్టి యభివృద్ధి నొందసాగెను. మరియు రామకృష్ణ దేవుడు నరేంద్రనాథుని గుణగణముల వివరించి గంగాధరుని నరేంద్రుని జూచిరమ్మని పంపెను. నరేంద్రుని గలిసిన గంగాధరుడు. నరేంద్రుని ధీకుశలతకు, ధైర్యాది గుణములకు ప్రేమ హృదయమునకు మిక్కిలి ఆనందించి, అనేక విషయముల నాతనినుండి గ్రహించెడివాడు. శ్రీ రామకృష్ణ వాక్యముల సారమును గ్రహించి, సాధనాపాటవము నార్జించి, గురు నిర్యాణానంతరము తన జీవితమును త్యాగమయము గావించి గంగాధరుడు శ్రీ అఖండానంద స్వామియై యొప్పెను.

అఖండానందుడు యాత్రలు సల్పుచు, తీవ్ర తపో నియతి నుండుచు, కేదార్ బదరీనాథ్‌లగూడ దర్శించెను. ఇతనికి ఆంగ్ల పరిజ్ఞానముకంటె సంస్కృత జ్ఞానము అధికమై యొప్పుటచే ఖేత్రీ నగరమునగల సంస్కృత కళాశాలను వేద పాఠశాలగ మార్పుజేయించెను. అవును, మన ప్రాచీన భారతీయాధ్యాత్మిక ఔన్నత్యమును బహువిధముల వక్క

జేయునవి మన వేద చతుష్టయమే గదా! ఆ వేదములే గదా మన సంస్కృతికి ప్రాతిపదిక! అవియే గదా జీవగఱ్ఱ. వాని రక్షించియే మన అఖండానంద స్వామి వేద పఠనమునకు ప్రాధాన్యత నొసంగి యుండనోపు! ఇతడు వంగభాషలో మంచి రచయితగను, వక్తగను పేరుప్రఖ్యాతుల గడించెను. 1925 వ సంవత్సరమున మఠమున కుపాధ్యక్షుడై, అంత 1934 న అధ్యక్షుడై యుండెను. హాస ప్రియుడును, సందర్శించు జిన్నయగు అఖండానందుడు వివేకానందునికి ప్రేమపాత్రుడు. ఎల్లర కానందము నిడుచు నిర్మలహృదయుడైన మన అఖండానందుడు 1937 ఫిబ్రవరి నెలలో నఖండ పరబ్రహ్మైక్యము నొందెను.

## శ్రీ నిర్మలానంద స్వామి

బలరామబోసు గృహమున కొక పరమహంస ఏతెంచు విషయము, కలకత్తాలోని బోస్పారాలో నివసించుచు స్నేహిత బృందముతో ప్రసంగించుచుండిన తులసీ చరణ దత్తునకు దెలిసెను. నాటికి యీతని వయస్సు పదునెన్మిది సంవత్సరములు. ఈ పరమహంస ఎట్లుండునో యను భావ మాతనికి దోచుటతోడనే బలరామబోసు యింటికి జని రామకృష్ణ పరమహంసను దర్శించెను. అదియే సద్గురుని ప్రథమ దర్శనము. మరల రెండవ పర్యాయము హరినాథ, గంగాధరులతో గలిసి దక్షిణేశ్వరమునకేగెను. కాని నాడు గురుదేవుడు కలకత్తకు వెడలియుండెను. అంత మూడవ పర్యాయము ఆ సాధుసత్తముని జూడనేగెను. ఆ గురువరేణ్యుడును

ప్రేమతో నా బాలుని జేరదీసి 'సాధకునకును భగవంతు
నకును సమావేశమును సమకూర్చు వ్యక్తియే మధ్యవ
ఆతడే గురువు' అని వచించె, ఇంతలో యంతరా మం
గ్రహించిన తులసియు శ్రీ రామకృష్ణునే గురువుగ దీక్ష
శ్రద్ధగా విశ్వసించెను. మరియు నా యతివరేణ్యుడు సాక్షా
గావించిన ప్రదేశముల నధిక 'శ్రద్ధాసక్తులతో గాంచె
తర్వాత తులసీ చరణుడు మహాపురుషు సన్నిధిని
గాడుచు, సాధనలజేయుచు, నాత్మానందమునకై శుశ్రూష
సలుపుచుండెను. రామకృష్ణ మహాసమాధి యనంతరమ
శ్రీ నిర్మలానంద స్వామి నామధారియై తులసీ చరణు
చెలువొందెను. బెంగుళూరు, మైసూరు, కొచ్చిన్, తిరు-
వాన్కూరు రాష్ట్రముల నిర్మలానందస్వామి బహుళము
ప్రచారమొనర్చి అనేక మఠముల స్థాపించెను.

## అభేదానంద స్వామి

సంస్కృతీపరులును, భక్తశిఖామణులు నగు రసికలా
చంద్ర, నయంతరాదేవి దంపతులకు 1866 న గలకత్తా పట్ట
ముస, కాళీవరప్రసాద సంజనితుడై కాళీప్రసాద చం
నామధేయమును వహించెను. జననీజనకు లా బాలుని
మహాపురుష జీవితముల ప్రాశస్త్యమును వివరముగ చె
ప్పుచు, దమ పుత్రు డట్టి పుణ్య పురుషుడుగ రూపొందవలె
నని గాఢముగ దలంచుచుండిరి. ఆ బాలుడును దానుగూ
ఆ మహాపురుషుల చందము ఉత్కృష్టాదర్శముల గ్రహించి
వారి దివ్యానుభూతుల గడింపవలెనని యారాటమొందు

దర్శనబంధ గ్రంథముల బఠించుచు, శంకరాచార్యుని త్యాగము, విద్య, మేధాసంపత్తు లాతని హృదయమును గదిలింప దానుగూడ నట్టి తత్త్వవేత్త కావలయునని భావించువాడు. శంకరుని పగిది ధీకుశలత గావలయునని దేవభాషయగు సంస్కృతమును బాలమునుండియే కాళీప్రసాదు డభ్యసించుచుండెను. జీవిత సమస్యల దీవ్రముగ యోచించు నా యువకుడు నాడే ప్రాక్పశ్చిమ మేధావంతుల గ్రంథముల బరిశీలించి భావిజీవితమునకు బునాదిని నిర్మించుకొననాగెను. ఒకపర్యాయము పండిత శశిధర తర్కచూడామణియొక్క 'భారతీయ షడ్దర్శనములు' అను ఉపన్యాసము నాలకించిన కాళీప్రసాద చంద్రుడు పతంజలి యోగిపుంగవుని యోగసూత్రముల నభినందించి, వాని బఠించి, అందలి సమాధ్యనుభూతులచే నాకర్షింపబడి, వానికై యావేదన మొందుచు, ఆ యనుభవముల బ్రసాదించు వ్యక్తికై యన్వేషణ మొనర్చుచుండెను. అట్టి దివ్యానుభూతుల సముపార్జనము గావించిన వ్యక్తి ఒక్క రామకృష్ణదేవుడే యని కాళీప్రసాదుడు తన స్నేహితుల మూలమున దెలిసికొని, దక్షిణేశ్వరమున కేగి ఆ విషయముల నా యోగిసత్తమునిచే గ్రహించుటకు స్థిరసంకల్పుడయ్యెను.

ఆ యాతురతచే నొకనాటి మధ్యాహ్నమున మండుటెండలో బయనమై, భోజనముగూడ మరచి కాళీప్రసాదుడు దక్షిణేశ్వరమునకు వెడలెను. తీవ్ర ఆధ్యాత్మిక జిజ్ఞాస లాతని హృదయమును బాధించుచుండ నీ బాహ్య క్షుత్పిపాస లాతని జలింపజేయవయ్యెను. కాని యాతని పరీక్షా మో

యనునట్లు నాడు గురుదేవుడు కలకత్తకు వెడలియుండె! ఇక ఆతని హృదయబాధను వర్ణింప నేరితరము? రాత్రి 11 గంటలకు రామకృష్ణదేవుడు దక్షిణేశ్వరమును జేరి యీ యువకుని పిలిచి వివరముల గ్రహించెను. కాళియు దన ఆవేదనమును లో నిముడ్చుకొనలేక వెంటనే సమాధివిషయ ప్రస్తావనము జేసి, దానిబొందుటయే తన యాశయమని దృఢముగా బలి కెను. అంత గురుదేవుడును ఆతని యాధ్యాత్మిక శుభలక్షణ ముల గాంచి, ఆనంద కంటకిత హృదయుడై, ఆతని పూర్వ జన్మమున గొప్ప యోగిగా గుర్తించి, ఆతని దరిజేర్చి, ఆతని వక్షమున తన దివ హస్తము నిడి, ఆతని నాలుకపై నేదియో యక్షరముల లిఖించి, ఆధ్యాత్మిక జీవిత సాధము నకు నాడే శంకుస్థాపనము గావించెను. కాళియు నేదియో అపూర్వ అనుభూతిని బొంది మరుదినము గృహోన్ముఖు డయెను.

పిమ్మట నా సిద్ధపురుషుని సాంగత్య మహిమచేగాళి ప్రసాదుని కోరికలు ఫలింపసాగెను. సర్వమత ప్రాశస్త్యము నాతడు చదివియున్నను సమన్వయ విధానమును గురుదేవు ముఖతః గ్రహించి ఆశ్చర్యమగ్నుడయెను. ఆ విధానము ఆచరణమున నుంచ కృషి సల్పుచు నతడు పరమప్రాణి సేవించుచుండెను. శ్రీరామకృష్ణదేవుని యనంతరము బారా నగర్ మఠమున నహర్నిశములు విద్యాసాధనల బ్రొద్దు పుచ్చుచు, శ్రీశారదా రామకృష్ణులపై నత్యద్భుతము శ్లోకముల లిఖించియుండెను. పిదప శ్రీ అభేదానందస్వామియై రాజిల్లి, పరివ్రాజ కేచ్ఛ జనింప పాదచారియై దేశదేశము

త్రికి, గంగోత్రి, యమునోత్తరి, కేదార్, బదరీనాథ్‌ల దర్శించి కలకత్తకు ఏతెంచెను. అభేదానందుని కలకత్తా ఆగమనమును తెలిసికొనిన వివేకానందుడు, లండన్ నగరము నుండియే ఆతని నటకు ఆహ్వానించెను. ఆ యాహ్వానము నంగీకరించిన అభేదానందుడు 1896లో లండన్ పట్టణమును జేరుకొనెను. అభేదానందుని వక్తృత్వము, విద్యా వైదుష్యము, ప్రాచ్య పాశ్చాత్య విషయ సమన్వయముల గ్రహించిన వివేకానందుడు వేదాంత ప్రచారమున అతడు నిర్వహింపవలసిన విధుల నెరుకపరచి, అచట నాతని ఉపన్యాసము నేర్పాటు గావించెను. ప్రథమమున అలవాటులేమిచే గొలదిగ జంకిన మన అభేదానందుడు వివేకానందుని ప్రోత్సాహమున ధైర్యముగ నత్యాదు తవిధాన బ్రసంగించి, తన అపార వాంఛిత ప్రకర్షచే వేలమంది శ్రోతల ముగ్ధుల గావించెను. నాటి యా సోదరుని ఉపన్యాస మాధుర మును గ్రోలిన మన వివేకానందుని ఆనందమునకు మేరలేదు. ఏమి యా భ్రాతృ ప్రేమ! మరియు నీ సోదరుని ద్వారమున వేదాంత ప్రచారము విరివిగ సాగుననియు నా నాయకోత్తముడగు వివేకానందుడు నాడు భావించి యుండనోపు!

పై విధమున మన అభేదానందు డట్లు ప్రచార మొనరించుచు 1897న నూ యార్కు నగరమున బ్రవేశించెను. అట నాతడు వరుసగా మోట్ మెమోరియల్ హాలునందు తొంబది యుపన్యాసముల నొసంగెను. ఆయనయొక్క ఆకర్షణీయ వక్తృత ము, ప్రవాహమునుబోలు ఆ వక్తృతయు ఆ సకలమత సమన యము నాటి యాదేశమును బ్రహ్మా

మున ముంచినవి. అట్లు సర్వవిధముల సంఘమున శ్రేష్ఠ ప్రతిష్ఠలబొందిన మన స్వామినిగూర్చి క్రైస్తవులు కొందఱు యీర్ష్య చే నాయనపై నెన్నియో దుష్ప్రచారముల సాగించుట ప్రారంభించిరి. 'క్షమా శస్త్రం కరే యస్య దుర్జనః కిం కరిష్యతి! అతృణే పతితో వహ్నిః స్వయమే వోపశామ్యతి!!' క్షమ యను శస్త్రమును కల్గినవానిని దుర్జను డేమి చేయును? తృణములేని స్థలమున బడిన యగ్ని స్వయముగా వదియే ఉపశమించును గదా యనుచందమున మన స్వామి యట్టివారి వచనముల సరకుగొనక నిలిచిన ధైర్య సాహసోపేతుడు. 1921వ సంవత్సరమున జపాన్, చైనా, ఫిలిప్పైన్స్, సింగపూర్ లలో నుపన్యాసముల నొసంగుచు భారతదేశమునకు అరుదెంచెను. 1923లో మరల పెషావర్, కాబూల్, పంజాబ్ మున్నగు పట్నముల నుపన్యాసములచే విరివిగా ప్రచార మొనర్చిన స్వామి కలకత్తకుజేరి, అట 'రామకృష్ణ వేదాంత సంఘము'ను స్థాపించి, 'విశ్వవాణి' పత్రికచే నెల్లరికీ వేదాంత విషయముల నభిరుచిని గలిగించుచు, సర్వుల యెడ ప్రేమచే నభేదదృష్టిజూచి, 1937 రామకృష్ణ శతవార్షిక జయంతుత్సవముల బాల్గొని, 1939 సెప్టెంబరున నీ మహానుభావుడు మహాసమాధినొందెను.

## శ్రీ అద్వైతానంద స్వామి

గృహస్థుడును, ఉద్యోగియు, ప్రాయమున శ్రీరామకృష్ణునికంటె బెద్దయువగు గోపాల్‌సుర్‌కు అకస్మాత్తుగ భార్య మరణము అధికమైన బాధను కలిగించెను. అట్టి సమ

యమున నాతని హృదయమునకు గలిగిన గాయమును మాన్పు నుద్దేశమున నాతని స్నేహితు డొకడు దక్షిణేశ్వర యోగికులావతంసుడగు రామకృష్ణదేవుని సన్నిధి కేగుమని అతనికి సలహా నొసంగెను. ప్రథమమున పరమహంసను దరిశించెనుగాని ఆతనికి శాంతి లభ్యము గాదయ్యెను. మరల ద్వితీయ పర్యాయము గురుదేవుని సందర్శించి, ఆయన త్యాగ వచనములచే ప్రబోధితుడై, ఉత్తేజమునొంది తన బుద్ధిని భగవదన్వేషణ దెసకు త్రిప్పి, ఆ మహాపురుషుని యుపదేశ ముల నక్షరశః పాటించుచుండెను. రామకృష్ణుని వ్యాధి సమయమున నధికతర సేవల గావించి ధన్యుడయె మన గోపాల్‌సుర్. అందరికంటె పెద్ద యగుటచే నతనిని అంద రును పెద్ద గోపాల్ అని పిలిచెడివారు.

అనంతరము బారానగర్ మఠమున ప్రథమమున నతడే ఆశ్రమవాసి యయెను. యతాశ్రమము స్వీకరించి, శ్రీ అద్వైతానంద స్వామి నామధారియై, దేశముల బర్యటింప సాగెను. క్షేత్రరాజమగు కాశీక్షేత్రమున మన స్వామి అయిదు వత్సరములు వసించి, మధూకరిచే జీవించుచు, తీవ్ర సాధనల సాగించుచు నిశ్చలత్వమును సాధించెను. అవును, 'నిశ్చలం మోక్ష ఉచ్యతే' నిశ్చలత్వమే మోక్షమని గదా శాస్త్ర తాత్పర్యము! పిమ్మట గలకత్తకు చేరి, పరమ హంస దేవుని శిష్యులలో నందరికంటె ప్రాయమున నధికుడై యుండిన అద్వైతానందుడు మఠమున నితర యువక సన్యాస సోదరులచే క్రమబద్ధముగ నన్నియు జేయించుచు, బ... తికు ప్రాధాన్య మొసంగుచు, మరణ పర్యంతము ప్ర...

బద్ధముగ సాధనాదుల జేయుచుండెను. గురువాక్యము లాచరించుటయం దాతని కాతడే సాటియై, గుర్వనుగ్రహముచే సర్వమును భగవనయముగా దర్శించిన నీ పుణ్యాత్ముడు 81 వత్సరములు జీవించి, 1904 డిశంబరు మాసమున సాక్షాత్పరబ్రహ్మస్వరూపుడగు శ్రీ రామకృష్ణ సాన్నిధ్యమును బొందెను.

## శ్రీ విజ్ఞానానంద స్వామి

బల్ ఘూరియాలో గౌరవనీయ కుటుంబమున 1868వ సంవత్సరమున హరిప్రసన్న చటోపాధ్యాయ జనన మొందెను. 1883లో హరిప్రసన్నుడు తన సహాధ్యాయుడగు శరచ్చంద్ర చక్రవర్తితో గలిసి శ్రీ రామకృష్ణ దేవుని సందర్శన భాగ్యమును బొంది, ఆ యోగిపుంగవునికి నాడే తన హృదయము నర్పించి, తన హృదయ పీఠమున రామకృష్ణ ఋషితిలకుని ఆరాధ్య దైవముగ నధిష్ఠింపజేసెను. తరచు దక్షిణేశ్వర మరుదెంచుచు, గురుసాన్నిధ్యమున నానందించుచు, నా వాక్యసుధ నాస్వాదమున గ్రోలుచుండెడివాడు. హరిప్రసన్నుడీ విధముగనున్నను యీతని కుటుంబమంతయు నా గురుదేవుని ఉన్మత్తునిగ భావించుచుండెడివారు. నిజమే, ప్రాపంచిక విషయాసక్తుల మనములు జంచలములగుట భగవదనుభవప్రపూర్ణులును, అజ్ఞానమానవోద్ధరణ కార్య నిర్వాహకులును, శాంతి ప్రదాతలునగు మహాత్ములు వారికి బిచ్చివారివలె గోచరింతురు. మరియు వీరు ఆ సాధుపురుషుల బరిహసించుటయు సహజమే! దానిచే నా మహాపురుషుల

యానందానుభూతికి నెట్టి బాధయు గలుగదుగదా! కుటుంబ మంతయు నాతీరుననున్నను హరిప్రసన్నుడు మాత్రము రామ కృష్ణుని విడువనేరక, గురుదేవుని స్పర్శచే దివానుభూతుల నున్నుచు 'నీవు నావాడివిగా మా జగన్మాత వచించినది. కాననే నిన్ను ప్రేమించుచుంటి'నని గురుదేవుని ముఖతః అభయ త్వము నొంది ఆ నిర్మల ప్రేమకు వశ్యుడై యుండెను.

అంత నతడు గలకత్తాలో చదువు ముగించి, పాట్నా జేరి అట పట్టభద్రుడయెను. పిదప పూనాలో సివిల్ ఇంజ నీయరింగ్ చదువుచున్న సమయమున రామకృష్ణదేవునకు వ్యాధి యంకురించుటయు, నీ శరీరమును బాయుటయు జరి గెను. కాని యీ విషయ మాతనికి దెలియలేదు. అలహాబా దున జిల్లా ఇంజనీయరుగా ఉద్యోగమునునున్న హరిప్రసన్ను నకు గురునిర్యాణవార్త గొంతకాలమునకు జేరెను. ఆ వార్త హృదయమునకు బాధను గలిగింప నెంతయు జింతించిన హరిప్రసన్నుని మరల రామకృష్ణదేవుని త్యాగ వాక్యములు గదలింప, వ్యాకుల చిత్తుడై, ఉన్నతోద్యోగమును త్యజించి కలకత్తాకు ఏతెంచెను. గృహమున కేగిన హరిప్రసన్నుడు తన యావేదనమును దల్లి కెరింగించి, ఆమె యనుజ్ఞబడసి మఠప్రవేశమొనర్చి శ్రీ విజ్ఞానానందస్వామియై యొప్పెను. పరివ్రాజకుడై జరించుచు, ఉద్గ్రంథముల రచించుచు, మఠ మున కుపాధ్యక్షుడై, యంత అధ్యక్ష స్థానమును గూడ అలం కరించి, అన్ని మతముల బర వేక్షించుచు, ఉపన్యాస ప్రసంగ ములుచేయక 'మానవ జీవితగమ్యము దైవానుభూతి. అది ఒక్కటిమాత్రమే యథార్థమగు దృష్టినొసంగు'నని గా,

ముగ విశ్వసించువాడు మన విజ్ఞానానందస్వామి. ఆ జీవితము నకు దన సర్వస్వమును ధారవోసి, 1938 జనవరిలో బేలూరు శ్రీ రామకృష్ణ దేవాలయమును సుందరముగ నిర్మించి, నా విధముల సంఘ శ్రేయస్కామియైన మన స్వామి 193. ఏప్రిలు మాసమున భగవత్సాయుజ్యము నొందెను.

పైవిధమున శ్రీ రామకృష్ణ దేవుని సన్నిధిని, ప్రాపం చిక విషయములు దరిజేరని నిర్మల నిష్కల్మష తాగ హృదయులగు యువకబృందము జేరి, ఆ జగద్గురు అనుగ్రహ వీక్షణా ప్రసారములచే దమ తమ నిజస్థితిని గ్రహించి, విషయ ముల సమూలముగ ద్రుంచి, యతి సార్వభౌములై తాగ ధనులై వెలుగొందిరి. వారి వారి గుణ గణముల నాకళిం చిన మన రామకృష్ణ పరమహంస దేవుడును వారి సంస్కా రానుగుణ్యముగ నుపదేశించుచు, సాధనల జేయించుచు, వారి యఘపుంజముల నశింపజేసి, సంకల్పమాత్రముననను, దృష్టి ప్రసారము చేతను, వాక్ప్రభావముచేతను, స్పర్శా మాహాత్మ్యమువలనను వారి మన శ్శరీరముల బ్రపూత మొన రించి, బ్రహ్మానంద సుధా స్వాదనము జేయు శక్తినొసంగి, వారిని దన యపూర్వ అగాధ అధ్యాత్మిక ప్రేమపాశముచే బంధించి, ఆ ప్రేమను వారి హృదయముల జొప్పించి, ఆ ప్రేమచేత వారు భావికాలమున సకల ముముక్షుకోటి నుద్ధ రించు అవకాశమును గల్పించి, ఆ ప్రేమ వారి మరణ పరం తము వీడకుండునట్లు దృఢసంకల్ప మొనర్చెను. ప్రజానీకము పాశ్చాత్య వ్యామోహాఘాతములచే స్వీయ సంస్కృతిని గోల్పోవనున్న తరుణమున బ్రస్తుత భౌతిక విజ్ఞాన మేఘ

సముదాయమును బార్ద్రోలు శీతల అభౌతిక పారమార్థిక ప్రాచీన సంప్రదాయ మారుతములబోలు వారును నా సంకుచిత భయంకర అజ్ఞానాంధమును నశింపజేయ చండప్రచండ కిరణముల దనరు భాస్కరుని రీతి విశాల విజ్ఞాన తేజోపుంజముల బ్రసరింపజేయువారు నగు బదునార్గురు వజ్రతుల్యశిష్యుల మన ప్రాచిన భారతీయ విజ్ఞానవైభవమును సమస్త ప్రపంచమునకు ఎల్లెత్తి చాట దయారొనర్చెను. కాన 'యః ప్రేరయామాస విధూత పాపాన్ సింహోపమేయాన్ దశదిక్షు శిష్యాన్' పాపదూరులు, సింహసమానులగు శిష్యుల నెవడు దశదిక్కులకు బ్రేరేపించెనోయని శరచ్చంద్ర దేవశర్మన్ శ్రీరామకృష్ణ దేవుని గీర్తించి యున్నాడు. సకల మతముల గ్రహించి, యంగీకరించి, వాని ననుష్ఠించి సర్వానుభవసంపదల మునింగిన శ్రీ రామకృష్ణ గురువరేణ్యుని శిష్యులగు వీరును ఒక్కొక్కరు ఒక్కొక్కమార్గము ననుసరించినవారై, సర్వానుభవమూర్తిరొుక్క సమన్వయత మును హృదయమున బదిలపరచి సర్వసమైక్యతను సాధించి ధనులై చెలువొందిరి.

## శ్రీ శారద - శ్రీ వివేకానందుడు

వీరందరికి మిన్నగా శ్రీ రామకృష్ణ సాంగత్యమహిమచే ఆ యనుభవజాలముల గ్రహించి, సాధించి, ఆనందించి, ఆచరణ రూపమున బ్రపంచమునకు జూపిన సాధ్వీమతల్లి, ప్రముఖ శిష్యురాలు శ్రీ శారదామణిదేవి. ఆమెవలెనే శ్రీ రామకృష్ణ సన్నిధి వసించి, సాధనల గావించి, సుర్వను

గ్రహ పాత్రుడై, శ్రీ పరమహంస ఉపదేశ సారము గ్రోలి, వాని ప్రపంచమునకు బోధరూపమున నందించిన పురుషపుంగవుడు, ప్రథమ శిష్యుడు శ్రీ వివేకానంద స్వామి. ఒక గురువునే యాశ్రయించి, ఒకరి శిక్షణమునకే మెలంగినను వీరిరువురిలో, నపూర్వ సుసూక్ష్మ వ్యత్యాసము పొడగట్టును. అనుభవ మంతయు హృదయాశ్రితము. హృదయ ప్రాధాన తగల వ్యక్తి స్త్రీ. కాన అట్టి విశాల హృదయ సంపన్నతచే సద్గురువరేణ్యుని హృదయగత సర్వాధ్యాత్మికానుభూతుల నాస్వాదించిన ఉత్తమ స్త్రీ మూర్తి మన శారదామాయి. మరియు శాస్త్రమార్గ విజ్ఞ బుద్ధి నాశ్రయించి యుండును. ఆ బుద్ధి పురుషాశ్రితము. కాన అట్టి ధీకుశలతచే నవతారమూర్తియొక్క మనోగత సర్వాధ్యాత్మిక విజ్ఞానమును గ్రహించిన ఉత్తమ పురుషుడు మన వివేకానందుడు. గృహస్థ జీవితమున నున్నటుల దోచుచు గృహస్థులకు సన్యాసులకు నాదర్శమై యలరారునది తపస్విని మణియైన శారదాదేవి. బ్రహ్మచారియై తురీయాశ్రమమును గొని, సన్న్యాసాదర్శముల జూపిన యోగిపుంగవుడు వివేకానందుడు. వాసస్థానమును వీడక ఎల్లర దన ఆత్మశక్తిచే తన సన్నిధానమునకే రప్పించిన ఆత్మశక్తి సంపన్న శారదామణి. పరివ్రాజకుడై, ఆత్మశక్తిచే నన్ని యాటంకముల నెదుర్కొని వాని నతిక్రమించిన అద్భుతశక్తి సంపన్నమూర్తి వివేకానందుడు. ఆచరణముననే సర్వాదర్శముల ప్రదర్శించి ప్రాణుల ప్రణతుల గొనిన జగద్వంద్య పుణ్యచరిత మనజగన్మాత శారదామాయి. సర్వుల హృదయముల జొచ్చి, వారి హృదయ

గత దుర్గుణముల నెరుకపరచి, సనాతనోపదేశముల గావించు చున్నవో యనునట్లుండు వేదాంతోపన్యాస పరంపరచే బశ్చిమదేశవాసుల దలలూంచి, వందనముల గైకొని నీరాజన ముల నొందిన జగద్విఖ్యాతుడు, సుశ్లోకుడు మన జగత్ప్రఖ్యాత వివేకానందస్వామి. వేయేల ఒక్కమాటలో రామకృష్ణ దేవుని హృదయభాగము శారదగను, మనోభాగము వివేకా నందునిగను నిర్వచించిన చాలును. కాన శారదాదేవి జీవిత విధానమును గ్రహించి, ఆమె యుత్కృష్టత దెలిసికొని, ఆమె హృదయగత యనుభూతుల అగాధత్వమును విచారించి, అంత వాని నాచరించి ఆనందించుటయును, అట్లే వివేకానంద జీవిత విశేషముల బరిలన మొనర్చి, ఆతని యావేదనము బొంది, ఆతని విశాలత నర్థము జేసికొని, సమస్త విషయముల వాతని సునిశిత జ్ఞానము నవగాహనము జేసికొని, పిమ్మట వాని మన జీవిత శకటమునకు జోడించి యానందించుట యని హృదయపూర్వకముగ గ్రహించిననాడుమాత్రమే రామ కృష్ణ దేవునియొక్క సంపూర్ణ సమగ్ర స్వరూపమును యథాతథముగ గ్రహించినట్లగును. ఈ తత్త్వ ద్వయమును దెలియుటయే పరవసానము. ఈ రెంటి సమ్మేళన స్వరూ పమే రామకృష్ణ పరమహంస భగవానుడు.

## ఇతర శిష్యులు

కేవలము సన్న్యాసులే శ్రీరామకృష్ణుని ఆశ్రయించి, తరించుటగాక, పనేక గృహస్థులుగూడ నా భాగ్యమును బొందిరి. మన రామకృష్ణ దేవుడు సన్న్యాసుల కెంత యాద

ర్శమో అట్లే గృహస్థులకుగూడ నాదర్శముగనే నుండెను.
సర్వ భూతాత్మకానుభవకోటి అతనిలో నంతర్గత మగుటచే తన్ను
నాశ్రయించినవారికి వారి వారి గుణ సంస్కారముల ననుస
రించి బోధించుచు, ఉపదేశించుచు, వారివారి యిష్ట దైవో
పాసనమునే బోధించుచుండుటచేత నతని సర్వతోముఖ వ్యక్తి
త్వము సర్వ మతస్థులకు ఆదర్శమై తనరారెను. ప్రపంచమున
గృహస్థుగనున్నను భగవద్దర్శనావేదనాపరు లందరికి మన
గురుదేవుడు ఆదర్శమే. ప్రపంచాతీత స్థితులగోరు శ్రీ
ముముక్షువులకుగూడ నతడు పరమాదర్శమే. కాన రామ
కృష్ణు డెట్లు గృహస్థుల కుపయుక్తుడయ్యెనో, ఎవరు అతని
ననుసరించి తరించిరో మొదలగు ముఖ్యాంశముల జూచెదము
గాక!

ప్రేమ నిలయమగు హృదయముగలిగి, గృహస్థాశ్రమ
మును గ్రహించియు నిస్సంగుడై, మన రామకృష్ణుని దర్శించి
అతని యాజ్ఞానుసారము ప్రవర్తించుచు, తీవ్రసాధనల మునిగి
'భగవంతుని దర్శనభాగ్యము నొందని యీ శరీరమున
కాహార మెందులకు?' అని శరీరమును కృశింపజేసి, సర్వకా
ల సర్వావస్థల గురుదేవుడగు సాధుసత్తముని భక్తిమై భజిం
చుచు, 'పద్మపత్రమివాంభసా' తామరపత్రమున గల జల
కణమువలె అంటియంటక గృహమున వర్తించుచు, ప్రపంచ
విషయముల నిరముడై, తన జీవితమును బరిశుద్ధ మొనర్చు
కొని, ఆదర్శ గృహస్థు అని ప్రఖ్యాతి గాంచిన దుర్గాచ
నాగ్ శ్రీరామకృష్ణుని గృహస్థశిష్యులలో ప్రథముడు. నాగ

కతడే సాటియై, ఆదర ప్రాయుడై వివేకానందాది సన్న్యాస గణముచేగూడ గౌరవము నొందిన ఉత్తమ వ్యక్తి.

అదేవిధముగ గొప్పవక్తయు, నాటకకర్తయు, నాట్య కళాకౌశలుడు అయియుండియు, దుర్వ్యసనముల కాహుతియై యుండిన గిరీశచంద్రఘోషుగూడ, అసాధారణలీల శ్రీరామ కృష్ణు నాశ్రయించి, తన పూర్వ విధానముల సంస్కరించు కొని, దేవీభక్తితో శ్రీపరమహంస శిష్యుడై, ఆజనాంతము పాదదాసుడై చెలువొందెను. మిక్కుటదుర్మార్గ ప్రవృత్తి గలవారు అయినను, ఆ యోగిపుంగవుడు వారి సమదృష్టి గాంచి, వారిలోగల దుర్నడతను సంస్కరింపజేసి, అసాధా రణ పరిణామము గలుగజేసి, తరింపజేసెను. ఇది అపూర్వము, అద్భుతము. ఇట్టి పాపాతులుగాని, దురాతులుగాని పరమ పురుషుల సన్నిధానముననుండ 'యథా పర్వతమాదీప్తం నాశ్రయంతి మృగాద్విజాః। తద్వ ద్బ్రహ విదో దోషా నాశ్రయంతి కదాచన॥' ప్రజ్వలితమగు పర్వతము నెట్లు మృగాదులు చేరవో అట్లే బ్రహ్మానందవిలోలురగు నవతార పురుషులను ఎట్టి దోషములు జేరజాలవు అను మైత్రేయ యుపనిషదా క్యమువలె మహాపురుషుల నెవ్వియు బాధింప కుండుటయేగాక ఆశ్రితుల పాపములుగూడ బటాపంచలగును.

ఇటులే మహేంద్రనాథగుప్తయు, మన రామకృష్ణ దేవుని ఆశ్రయించి, తా జ్ఞప్తించుకొనుటకై పరమహంస దేవునికిని యితరులకును జరుగు సంభాషణముల నన్నిటిని వ్రాసియుంచుకొని, తనకు దీరిక సమయముల వాని నన్నింటి చదువుచు మననము చేసికొనుచు, అనుసరించుచు, గురుదేవ

అనుగ్రహ పాత్రుడయ్యెను. ఇట్లు ఇతడు లిఖించుకొని యుంచుకొనిన మధుర సంభాషణములే Gospel of Sri Ramakrishna 'శ్రీ రామకృష్ణ వచనామృతము' అను పేర సుప్రశస్తమై అసంఖ్యాక సాధకులకు కల్పతరువై వెలుగొందెను. అట్టి అమూల్య ఆధ్యాత్మిక సంపదకు కారణభూతుడు యీ ధన్యాత్ముడు.

ఇదే విధముగ, ప్రఖ్యాత బ్రహ్మసమాజమున కధినాయకుడై, ప్రాక్పశ్చిమ దేశముల దన వాఙ్మాధుర్యముచే వాసికెక్కించి, ఆధునిక విద్యానిమగ్నమైన యువకుల కాదర్శవ్యక్తియై యొప్పారిన కేశవ చంద్రసేన్, ధనాఢ్యులయ్యు నిరాడంబరులై రామకృష్ణదేవుని సేవాలాలసత్వమున కాలము గడుప నానందించిన బలరామబోసు, సురేశబాబు మొదలైన భక్తులెందరో రామకృష్ణ చరణ ద్వంద్వముల నాశ్రయించి, ఆదర్శవ్యక్తులై అనుభూతి నార్జించి ధన్యత నొందిరి.

పై వచించిన విధాన పురుషులేగాక, శ్రీ రామకృష్ణదేవుని యసాధారణ వ్యక్తిత్వమును స్త్రీగణముకూడ గ్రహించి, ఆశ్రయించి, ఆధ్యాత్మిక మార్గమున సుశిక్షితులై "సర్వవర్ణాధికారశ్చ నారీణాం యోగ్య ఏవ చ" అను గౌతమీ తంత్రమురీతి నాధ్యాత్మిక పథమున యోగత నార్జించి, సన్న్యాసమును స్వీకరించియు ధన్యాత్ములైరి. అందు కొందరిగూర్చి చూచెదము.

సుమారు ద్వాదశ వర్షప్రాయమున దల్లి దండ్రులు సంకల్పించిన వివాహమును వలదని త్రోసి, అమృత మోక్ష

హా మ్యాము నధిష్ఠింప విరాగమే శరణ మని, తల్లి అను గృహమును బాసి, సంపూర్ణ విరాగిణియై, సన్న్యసించి, దా దశ వత్సరములు తప మాచరించి, వివిధ ప్రదేశముల ద్రిమ్మరుచు, మన రామకృష్ణుని సన్నిధిని జేరి, అతని చైతన్యావతారముగా విశ్వసించి, తదాజ్ఞానువర్తినియై శ్రీ శారదాదేవీభాగమున గాలము గడిపినది గౌరీమాయి. సన్న్యాసినియై, విద్యావతియై కొన్నివేళల మన రామకృష్ణునకుగూడ ప్రమాణమై యొప్పారెను. ఆమె మన శారదామాయి పేర 'శ్రీశారదేశ్వరీ ఆశ్రమము' అను ఒక స్త్రీల మఠమును నెలకొల్పి, అందు స్త్రీలకు విద్యా కళల నేర్పుచు, నధికారులకు సన్యాసాశ్రమ మొసంగుచు, విద్యాజ్ఞాన విభూషితులగు అనేక సన్న్యాసినులకు గారణభూతయై చెలరారినది.

మరియు నఘోరమణి నాబడు వనితారత్నము, బాల్యమునందే భర్తను గోల్పోయి, జీవితమును భగవదన్వేషణాయత్తము గావించి, దక్షిణేశ్వరమునకు మూడు మైళ్ల దూరమున గల కామర్హాటిలో గంగానదీతీరమున శిథిలావస్థనున్న శ్రీ రాధాగోవిందాలయమున బాలకృష్ణుని వాత్సల్యభావమున నుపాసించుచు, తత్ఫలితముగ బాలగోపాలు సాక్షాత్కారమును బొంది సర్వావస్థల నతనితో నానందించుచు నుండెను. ఒకనాడు శ్రీరామకృష్ణు దర్శనార్థ మేతెంచి, అతడే తన యిష్టదైవమైన గోపాలునిగా గ్రహించి, తన వాత్సల్యప్రేమను మన గురుమూర్తిపై ద్రిప్పి భక్తాగ్రగణ్యయై వర్తిల్లుచుండెను. ఈమెను గోపాలుని తల్లి యని పరమహంసదేవుడు అనెడివాడు.

ఇదేవిధముగ గోలప్ మాయి, యోగిన్ మాయి, లక్ష్మి మొదలగు అనేక స్త్రీ శిష్యలును, జీవిత సార్థకతకొరకు రామకృష్ణు నాశ్రయించి, అనుసరించి ఆధ్యాత్మికానందాంబుధి మగ్న మానసులైరి. ఈ విధముగ జాతి మత లింగ విభేదముల నెంచక, సర్వ ముముక్షుకోటికి వందనీయుడై, యుపదేశకుడై, ఆచార్యుడై, అధిష్ఠానదైవమై, మన గురుదేవుడు సర సమత్వమును ప్రస్ఫుటపరచి యాదర్శమై వెలుఁగొందెను.

మన రామకృష్ణుడు సమస్తజీవుల సమత్వదృష్టి నెట్లు దిలకించెనో, అట్లే అతని యుపదేశములుగూడ సర్వతోముఖములై ఎల్లర కనయించునవిగా నొప్పారును. వానిలో ముఖ్యముల గొన్ని దిలకించెదము.

## బోధామృతము

‘గ్రంథముల శ్లోకముల గంఠస్థ మొనరించిన ప్రయోజనమేమి? జీవితపరమావధి ఈశ్వర సాక్షాత్కారము. ప్రథమమున దానికై యత్నింపుడు. భగవానుని బొంది పిమ్మట ప్రపంచమున నున్నను భయములేదు. కాన శాశ్వతమగు భగవంతుని ప్రథమమునను, పిదప నశ్వర ప్రపంచమును గాంచవలెను’. ప్రథమమున భగవదనుభూతిని బొందినవా నైహిక విషయములపై నెట్టును గోర్కె జనింపదుగదా! ‘భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః’ అను ముండకశ్రుతి ప్రకారము సంశయము లడంగును. అట్టివారు ‘వీతరాగభయక్రోధః’ అను గీతావాక్యమురీతి క్రోధా

నుండి విడివడి, 'ధీరః వర్తమానోపి లోకవత్' అనునట్లు గురుడయు ను లోకరీతి వర్తించును. అట్టితరి 'నాయమాత్మా ప్రవచనేన లభ్యః' ఆత్మ, గ్రంథపఠనముచే లభింపదు అను శ్రుతి ప్రకారముగ గ్రంథము లెట్లు ముక్తి నొసంగును? అందుచే మన రామకృష్ణు డీవిషయమును ముఖ్యముగ వచిం చుచు, గ్రంథములకంటె సాధనకు ప్రాధాన ము నొసంగెను.

'ప్రపంచమున భార్యా బిడ్డలకై, ధనధాన్యా దులకై విలపింతురుగాని భగవంతుని కొరకై విలపించువారేరి? యథార్థ ముగ భగవంతుని హృదయపూర్వకముగ ప్రార్థిం చుచో నతని సాక్షాత్కారము బడయనగును. కొందరికి ధనముకొరకు పిచ్చి, కొందరికి పిల్లల పిచ్చి. కాని భగవదునా దము గలిగినవారు ధన్యాతిధన్యులు'. ఈ ప్రాపంచిక సంపద కొరకు దుఃఖింతురు కాని 'న సంతి పుత్రా త్రాణాయ న పితా నాపి బంధవా। అంతకే నాధిపన్నస్య న పీధి జ్ఞాతిషు త్రాణతా' యమాహ్వానము నాబడు మృత్యుముఖమున నుండువాని, తండ్రి, పుత్రులు, బంధువులు, జ్ఞాతులుగాని తప్పి పజాలరు అని బుద్ధభగవానుడు వచించినచందము వీని నన్నింటి నిసా రములుగా త్యజించి, భగవత్ప్రాప్తికై పిచ్చి ...ంది 'బాలోన్మత్త పిశాచవత్' అనునట్లు వర్తింపవలెనని మన రామకృష్ణుని యాదేశము. అవును, ప్రాపంచిక విషయ ములనుండి ఎంత విడివడినచో అంత భగవత్సన్నిధానము చేకూరునుగదా!

స్త్రీ పురుషులకు సమముగా వర్తింపజేయుచునట్లు 'శాకు శాం... ...' సత్యాన్వ... ...తువులు గాన నాద్వ...యము.

దర్శింపు' డని రామకృష్ణుడు నొక్కి వక్కాణించును. కామ కాంచనముల నొందరు కామినీ కాంచనములని వచింతురు. గాని, 'కామము స్త్రీ పురుషు లిరువురియందును సమముగా నుండును. అందుచే కామమును బారద్రోలి ఆధ్యాత్మికానంద విభూతి నొందుడు' అని రామకృష్ణ దేవుని అనాయము. మానవ జీవితమున వేరుపురుగువలెనుండి ఇహపర విత్తము రెంటి యందును సౌఖ్యము లేకుండజేయు నీ కామము నెవ రేని త్రుంచ మట్టింప నవసరముగదా! అటులే కాంచనతృష్ణ గాక సాధన తృష్ణయున్నచో జన్మ సార్థకము. ఐహిక విషయ ముల తుష్టియు నాధ్యాత్మిక విషయముల తృష్ణయు సతతంబా వసరమనిగదా మన వివేకానందుడును వచించును. కావున నాధ్యాత్మికాభివృద్ధి గాంక్షించు వారు తప్పనిసరిగా 'కామ కాంచనము' లనుండి వైదొలగినగాని శాంతి యసంభవము. ఈ రహస మును మన రామకృష్ణు డుపదేశించి ఆధ్యాత్మి జీవిత కీలకమును ముముక్షుకోటికి ప్రసాదించినాడు.

He who was Rama and Krishna, is now Rama-Krishna in this body - but not in your Vedantic sense

'ఏ దేవుండట రాముడై తనరి శ్రీకృష్ణుండుగా నయె నో ఆ దేవుండె సు రామకృష్ణుడను నీ యాకారమున్ దాల్చె' అను విధంబున శ్రీరామ శ్రీకృష్ణుల సంయోగస్వరూపమే మన శ్రీరామకృష్ణుడుగా దానే వచించెనుగదా! మరియు 'ఏకదా రోహమారూఢం లాలయంతీ సతీ సుతం। మాణం శిశో రో ధుం న సెహె గిరికూటవత్॥' యశోద యొక నాడు బాలకృష్ణుని వంకమున నిడుకొని లాలించుచుండ నా బాలు డామె మోయలేనంత బరువై పెద్ద పర్వతమువలె

ద్భోచెను అను భాగవతశాస్త్రమురీతి మన రామకృష్ణుడు బాల్యమున నిట్టి మహిమల ననేకము శ్రీకృష్ణునివలె గనపరచెను. అదే విధముగ నుపనయనమునాడు తన వాగ్దానమునకు భంగము వాటిల్లకుండ ధనినుండి భిక్షగొనిన సత్య వాక్య పరిపాలనా ధురంధరుడగుటచేతను, మరియు భైరవి బ్రాహ్మణి కెంచుక్క యిష్ట దైవమగు శ్రీరామచంద్రునిగ సాక్షాత్కారమై యుండుట నామె మన పరమహంసదేవుని రఘురాము నిగ బరిగణించి యున్నది. ఇట్లు శ్రీరాముని లక్షణములును మన గురుదేవునందు వ్యక్తము. శ్రీరామ శ్రీకృష్ణులవలె నితడును అవతార పురుషునిగా నారాధింపబడుచు, పండిత పామర విచక్షణలేక ముముక్షుకోటికి తన ప్రగంటి వీక్షణా ప్రసారముచే ముక్తి నొసంగెను. అందుచే మన రామకృష్ణుడు శ్రీ రామకృష్ణాద్యవతారమూర్తులను అంతర్లీన మొనర్చుకొనిన నవతారశ్రేష్ఠుడే యని విదితము.

## మహా సమాధి

ఇంతవరకు జూచిన తెరంగున బాల్యమునుండియు సమాధుల మునుగుటచేతను, శ్రీ విశ్వేశ్వరీ దర్శనాకాంక్షచే దన శారీరక ఆరోగ్యమును సరకుగొనక దీవ్రసాధన గావించి, ఆ లోకైక జననిని సాక్షాత్కరింపజేసికొని, అంతటితో దృప్తి గాంచక సకల దేవతామూర్తుల దర్శనభాగ్యమునకై బహువిధ సాధనల మునింగి, అనుభవముల గడించి, తనవద్ద కరుదెంచు మోక్షేచ్ఛాపరులకు మార్గదర్శకుడై వారి యభీష్టమునకై తపించుచు, దన జీవితమును లోక క్షేమమునకై

యంకిత మొనర్చిన మన రామకృష్ణునకు నిసుమంతయేని విశ్రాంతిలేక, 1884 వ సంవత్సరమున గంతమునందు నొప్పి ప్రారంభించెను. అది క్రమముగ వృద్ధి చెంది తుదకు వ్రణముగా పరిణమించెను. అట్టి సమయమున నతనికి మహా తీవ్రత హానికరమగుటచే వైద్యులు రామకృష్ణునికి సమాధులు రాకుండ జాగ్రత్తపడ శిష్యులకు హెచ్చరిక జేసిరి. కాని యది సాధ్యమా? ప్రపంచ విషయముల మునింగిన చి... మును భగవదర్పణము గావించుట కష్టము. అటులే ఈశ్వర ప్రాప్తి నొందిన మనస్సు ఆజ్ఞాచక్రము జేరిన నది యిక ప్రపంచమునకు దిగజాలదు. అందుచే గర్భమునుండి సమాధి సంస్థితుల లీనమైన మన రామకృష్ణుని సమాధుల నిలుపుట ఎవ్వరికి సాధ్యము? కాన నతని వ్యాధి తీవ్రమై కంఠమునుండి ఆహారపదార్థములు లోనికరుగుటయు గష్టమయ్యెను. చికిత్స కొరకై శ్రీరామకృష్ణుని శిష్య వర్గము కలకత్తకు జే...కాని యటగూడ గురుదేవునకు క్షణము విశ్రాంతి లేదు.

ఆనాటికే శ్రీరామకృష్ణుని గొప్పదనము అంతట ప్రస రించుటచే, బూర్వము దూరమున నున్న గురుదేవుడు ద రకు వచ్చి యుండుటచే గలకత్తా పౌరులు అతని దర్శన భాగ్యము నొందుటకై అసంఖ్యాకులుగ రా ప్రారంభించిరి. అందుచే రామకృష్ణుని కలకత్తా పరిసరములగల కా పురమునకు గొంపోయి చికిత్స చేయించుచుండిరి. శిష్యవర్గమంతయు నహర్నిశములు గురువర్యు సేవయందే మునింగిరి. వా... తీవ్రమైనను పాటింపక, జగద్గురువర్యుడైన రామకృష్ణు... అనవరతము శిష్యుల భావిజీవితమునకు బునాదులకై ...

నుపదేశముల జేయుచు, శిక్షణ మొసంగుచుండెను. ఆహా! నిష్కామముల నిస్వార్థుల చైదము లవియేగదా! తన జీవిత నాటకమును విశ్వేశ్వరి ముగింపనున్నదని మన రామ కృష్ణుడు గ్రహించి, యిక శరీర త్యాగమునకు రెండు దినము లకు ముందు, భావి ప్రపంచోద్ధారకుడు, సర్వశక్తి సామర్థ్య ములు గలవాడును, తన దివ్య సందేశజ్యోతులచే బ్రపంచము నందలి యజ్ఞానమును పోగొట్టి వెలుగునొసంగువాడును, అగు నరేంద్రుని జేరబిలిచి, తనకు శ్రీకాళికచే నొసంగబడిన దివ్య శక్తుల నతనికి నర్పించి, వివేకానంద బీజముల నరేంద్రునిలో నాటెను. అంత 1886 ఆగస్టు 17వ తేదీన మన రామ కృష్ణదేవుడు తన మూర్తిని సూక్ష్మరూపమున విశ్వవ్యాప్త మొనరించి తరింపజేయ నీ స్థూల దేహమును దహించి, అనంతా క శిష్య సముదాయమును దుఃఖసాగరమున ముంచి, మహాసమాధి నొందెను. అట్టి ప్రేమమూర్తిని, పరమపవిత్ర రూపమును, గురుదేవుని, అవతార స్వరూపుని గోల్పోయిన శిష్యకోటియొక్క హృదయవేదనను వర్ణింప నేరికి వశము?

గరు స్థుడైన నాటనుండియు ననేక దివ్య విభూతుల బ్రద ర్శించి, జనించినదాది బాల లీలలలో దన దేవత్వమును బ్రక టించి, శ్రీరామ శ్రీకృష్ణ అవతారముల ననేకము వ్యక్త పరచి ప్రాపంచిక విద్యా విముఖత్వమున బరవిద్యానిధియై విరాజిల్లి, పరిణయమాడియు భార్యను తన జననిగ బూజించి ముముక్షువులకు మానవ జీవితగమ్యము నెరుకపరుప దానే [illegible] విషయమును చిన్ననాటినుండియు గ్రహించి, 'భావ [illegible] పరంభూతాని యంత్రారూఢాని మాయయా' [illegible]

గీతా వచనముపోలె మాయా ప్రాబల్యమున యంత్రమునశె దిరుగుచున్న నర మానవానీకముపై దయదలంచి, ఉత్తమ సాధనావిధానమును ప్రసాదింప సంకల్పించి, ప్రపంచ మును సంపూర్ణముగ నవగాహన మొనరించుకొని, పునాది లేని సాధనలో మునుంగు సాధకుల వీక్షించి చింతించి, అపార ప్రేమార్ద్ర హృదయమున, నున్నత సౌధమునకు బునాది వలె నుత్తమోత్తమాధ్యాత్మిక సౌధరాజమునకు పవిత్రత యను బునాది అత్యావసరమని 'ఓ మానవులారా, తాత్కాలిక ఆవేశములతో గూడుకొనిన మీ సాధనా విధానముల గట్టిపెట్టుడు. పునాదిలేని గోడ ఎంతకాల ముండును ? ఆధ్యాత్మిక సౌధమును నిర్మింపగ బునాదుల దృఢముగా నిర్మింపుడు. అదియే పవిత్రత. అది బ్రహ్మచర్యమువలననే ప్రాప్తము. అదియు శ్రీ జగన్మాత అనుగ్రహ విశేషమున లభ్యము. బ్రహ్మచర్యములేని సాధన, గట్టులేని పొలమునకు నీరు పెట్టుట వంటిది' అని ఎలుగెత్తి, తన పరమపావన సందేశమును ప్రపంచమునకు మన రామకృష్ణదేవుడు ప్రకటించి, ఆధ్యాత్మిక సాధన రహస్యమును బోధించెను. అట్టివాడగుటచే, నతడు నిరుపేదవాడై యున్నను ఆత్మధన సంపన్నుడు గాన ధనాఢ్యులు, ఐహికవిద్య లేకున్నను సర్వవిద్యా మూలమగు బ్రహ్మవిద్యా సంపన్నుడగుటచే విద్వాంసులును, గాయకులు, కవులు, కళావేత్తలు, సనాతనులు, నాస్తికులు, తార్కికులు సంస్కర్తలు మొదలగు వివిధ సాధకలోకము మన రామకృష్ణుని పాదసన్నిధిని జేరి, వినమిత శిరస్కులై చిత్త సంస్కారము బొంది తరించిరి. ఏయొక మతా

మానియు గాకుండుటచే, సర్వమతసారము గ్రహించి యుండు టచే సర మతావలంబకులు ఆయన చెంత కరిగి దాసులై, వారివారి మత రహస ముల ననుభవయుక్తముగ గ్రహించిరి. సామాన లోకమునకు నున్మాదుడైన మన రామకృష్ణుడు అసామాన్యముగ ననేకుల ప్రపంచ విషయోనా దమును గుదిర్చెను. అనేకులకు ఆత్మవిశ్వాసమును, ప్రేమతో శాంతిని ఆత్మానుభూతిని బ్రసాదించెను. శ్రీరామకృష్ణుడు బోధించినది వివిధ మత సిద్ధాంతముల యైక్యతగాక హృదయ ముల ఏకత ము. అందుచేత సర్వవేళల నతని పండితులేమి, పామరులేమి, సర్వమతములవారు ఆశ్రయించిరి. అది మన పరమహంస దేవుని అసమాన ఆత్మబల విశేషము. కోటాను కోట్ల భక్తకోటి నేడు అతని నారాధించుచున్నారనిన ఆ జగ ద్గురువరు ని అవతార శ్రేష్ఠత్వమేగదా!

ఒకని యుత్కృష్టాదర్శమును గాంచ ఆశ్చర ము, అంత నతని జీవిత విషయముల బరిశీలన, నట నతని యను సరణము, పిమ్మట తత్సిద్ధిని బడయుట ఆధ్యాత్మికలోకమున సామాన ము. కాన నింతవరకు మన రామకృష్ణుని జీవిత విశేషముల బరిశీలించి, అచ్చరువొంది, వివరముల బరిశోధించి యుంటిమి. ఇక అనుసరణము సిద్ధియు బడయుటకై, ఆత్మబల మును సువ్యక్తపరచి పూతచరిత్రుడైన, అవతారవరు ని, జగద్గురుని, శ్రీరామకృష్ణ పరమహంస దేవుని జన్మదినమగు నేడు బద్ధకంకణ హస్తులమై అచిర కాల నిశ్చల సాధనాబలమున నానందదాయక ముక్తిఫలమును బొందుదుముగాక!

# జీవితవిశేషములు

1836 గదాధరుని జననము 18-2-36 ఉ॥ 5. 15 లకు

1843 ఖుదీరాముని మరణము.

1845 గదాధరుని ఉపనయనము.

1852 గదాధరుడు అన్నతో కలకత్తకేతెంచుట.

1853 శారదాదేవి జననము.

1855 దక్షిణేశ్వరీ కాళికాలయ నిర్మాణము.

1856 రామకుమారుని మరణము - గదాధరుని కాళికాలయమున అర్చకత్వము - శ్రీ కాళికా సాక్షాత్కారము.

1859 శ్రీ శారదా గదాధరుల వివాహము.

1861 భైరవీ బ్రాహ్మణి ఆగమనము - తంత్రసాధన.

1864 జటాధారి ఆగమనము - వైష్ణవభావ సాధన - తోతాపురి ద్వారా సన్న్యాస స్వీకారము.

1872 శ్రీ శారదాదేవి దక్షిణేశ్వరమునకు ప్రథమమున వచ్చుట-షోడశీ పూజ.

1879 శిష్యుల ఆగమనము.

1885 శ్రీ రామకృష్ణునికి వ్యాధి ప్రారంభము.

1886 శ్రీ రామకృష్ణునికి కాశీపురమున చికిత్స.

**16-8-86 ఉ॥ 1-2 లకు శ్రావణ కృష్ణ పాడ్యమి మహా సమాధి.**



# అనుభవానంద గ్రంథమాల-బాపట్ల

## ప్రచురణములు

1. శ్రీ రామకృష్ణ లీలా సంకీర్తనము : 5వ ముద్రణము
శ్రీరామకృష్ణ, శారద, వివేకానందులగూర్చి భక్తిప్రబోధకరముగా 149 కీర్తనలు. 1/16 డెమ్మీ, 420 పుటలు రు. 0-75

2. శ్రీ రామకృష్ణాంజలి : 3వ ముద్రణము
శ్రీరామకృష్ణ వివేకానంద తత్త్వములగూర్చి భక్తి ఉత్సాహ పూరిత పద్యములు 100. 0-12

3. శ్రీ దక్షిణేశ్వరీ స్తవము : 2వ ముద్రణము
భక్తితో తత్త్వ విషయముల ప్రబోధించు శతకము. 0-12

4. చిత్త ప్రబోధ : 2వ ముద్రణము
సాధకుల కనేకఅమూల్య రహస్యముల బోధించు శతకము. 0-12

5. సాధన రహస్యము : 6వ ముద్రణము
అధ్యాత్మికాభివృద్ధికి మూలమైన యోగసూత్ర సాధన చతుష్టయముల చక్కని శిష్ట వ్యావహారిక భాషలో తెలిపిన సుప్రసిద్ధ గ్రంథరాజము. 1/8 క్రౌను 348 పుటలు 4-00

6. అనుభవానందము : 3వ ముద్రణము
అద్వైతానంద విభూతిని వ్యక్తపరచు శతకము. 0-12

7. సాధన సుధ : 2వ ముద్రణము
సాధనలో దగులు అటంకముల నివారించు అమూల్య సుగు వలపాల నొసంగు పద్య గ్రంథము. 1/8 క్రౌను 100 పుటలు. 1-00

8. మన శారదామాయి : 2వ ముద్రణము
శ్రీ త్యాగీశానంద విరచితము. జగన్మాత శ్రీ శారదామాయి జీవితోపదేశాలు వివరించు ఉత్సాహపూరిత సులభ గ్రంథము. 1/8 క్రౌను, 116 పుటలు. 1.[illegible]

9. మన వివేకానందుడు : 3వ ముద్రణము
శ్రీ త్యాగీశానంద విరచితము. వేదాంతకేసరి శ్రీ వివేకానందుని జీవితాదర్శముల ప్రబోధించు ఉత్కృష్ట గ్రంథము.
1/8 క్రౌను, 130 పుటలు. 2.[illegible]

10. మన రామకృష్ణుడు : 3వ ముద్రణము
శ్రీ త్యాగీశానంద విరచితము. జగద్గురు శ్రీ రామకృష్ణుని అద్భుతాదర్శ సాధన వివరముల సుగమము గావించు గ్రంథము. 1/8 క్రౌను, 150 పుటలు. 2.00

11. సర్వ సిద్ధాంత సౌరభము – 2వ ముద్రణము
1వ సంపుటము: దర్శన ఖండము – ప్రథమ భాగము – సాంఖ్య యోగములు. శ్రీ కపిల పతంజలి మహర్షుల జీవితకాల విశేషములు, సిద్ధాంతములు యిట వర్ణితము.
1/8 క్రౌను, 380 పుటలు. 4.[illegible]

12. శాంతి సామ్రాజ్యము : శాంతిని గోరు నేటి ప్రపంచమునకు శాంతి ప్రబోధ గావించు ఉత్తమ గ్రంథము.
1/8 క్రౌను, 40 పుటలు. 0.[illegible]

13. శ్రీ రామకృష్ణాదర్శము : 2 వ ముద్రణము
శ్రీ రామ కృష్ణుని సాధన, సిద్ధుల రహస్యమును వివరించు ఉత్తేజకర చిన్న గ్రంథము. 1/8 క్రౌను, 20 పుటలు. 0.15

14. శ్రీ రామకృష్ణ పూజ : శ్రీ రామకృష్ణ పూజావిధానము సహస్ర అష్టోత్తర శత నామములతో నలరారు గ్రంథము.

1/16 డెమ్మి. 70 పుటలు. 0-50

15. పర సిద్ధాంత సౌరభము – 2వ సంపుటము : దర్శన ఖండము - ద్వితీయ భాగము – వైశేషిక న్యాయములు – శ్రీ కణాద, గౌతమ మహర్షుల జీవితకాల సిద్ధాంతములు పండితాభిప్రాయములతో రచితము.

1/8 క్రౌను. 300 పుటలు. 3-00

16. పర సిద్ధాంత సౌరభము – 3వ సంపుటము : దర్శన ఖండము – తృతీయ భాగము – మీమాంసాద్వయము – శ్రీ జైమినీ వ్యాసమహర్షుల జీవితకాల సిద్ధాంతములు ఆధునిక పండితాభిప్రాయములతో రచితము.

1/8 క్రౌను. 340 పుటలు. 3-00

17. పర సిద్ధాంత సౌరభము – 4వ సంపుటము : అద్వైత ఖండము – ప్రథమ భాగము - శ్రీ శంకర పూర్వాద్వైతము - వేదములనుండి శ్రీ శంకరులవరకు ప్రవహించు అద్వైత రసప్రవాహమును తెలుపు విపుల గ్రంథము. అద్వైత సిద్ధాంతమునకు, ఆధునిక భౌతిక విజ్ఞానమునకు సమన్వయమును జూపును. 1/8 క్రౌను, 440 పుటలు. 4-25

18. మాండూక్య రసాయనము : 2వ ముద్రణము శ్రీ అనుభవభాష్యము. 108 ఉపనిషత్తుల ముఖ్య మం[illegible]ము లతో, గౌడపాద కారికలతో వ్యాఖ్యానము.

1/8 క్రౌను, 2[illegible]0 పుటలు. [illegible]5

19. సర్వ సిద్ధాంత సౌరభము - 5వ సంపుటము :
అద్వైత ఖండము - ద్వితీయ భాగము - శ్రీ శంకరాద్వైతము. శ్రీ శంకర జీవితకాల విశేషములు, అద్వైత సిద్ధాంతము విస్తృతముగా వివరింపబడినవి. పన్యాస ప్రాశస్త్య, అధికార వివరములను గలవు.
1/8 క్రౌను, 520 పుటలు. 4

20. సర్వ సిద్ధాంత సౌరభము - 6వ సంపుటము :
అద్వైత ఖండము - తృతీయ భాగము - శ్రీ శంకరానంతరాద్వైతము, శ్రీ సురేశ్వర, విద్యారణ్య వివరణము విపులముగా నిందుండును. 1/8 క్రౌను, 315 పుటలు. [illegible]

21. ప్రాచీన భగవద్గీత : 748 శ్లోకములుగల అసలు గీత. భోజ పత్ర వ్రాత ప్రతినుండి ఉద్ధృతము.
1/8 డెమ్మి, 150 పుటలు. [illegible]

22. సర్వ సిద్ధాంత సౌరభము - 7వ సంపుటము :
వైష్ణవ ఖండము - ప్రథమ భాగము - విశిష్టాద్వైతము - వేదములనుండి వైష్ణవ సిద్ధాంత జనన చారిత్రము, శ్రీ రామానుజ జీవిత సమీక్ష, విశిష్టాద్వైత సిద్ధాంత వివరణములు యిందు ప్రస్ఫుటము.
1/8 క్రౌను, 350 పుటలు. [illegible]

23. శ్రీ వివేకానందాదర్శము : 2వ ముద్రణము
శ్రీ వివేకానందుని ఆదర్శము యిందు ప్రస్ఫుటముగ రచితము. 1/8 క్రౌను, 30 పుటలు. [illegible]

24. శ్రీ శారదాదర్శము : శ్రీ శారదాదేవి గొప్పదనముచే మన హృదయముల గదలించును. 1/8 క్రౌను, 20 పుటలు. [illegible]

25. సర సిద్ధాంత సౌరభము - 8వ సంపుటము :
వైష్ణవ ఖండము_ద్వితీయ భాగము- వైష్ణవము - శ్రీ మధ్వా
చార్యులమంకి శ్రీకృష్ణ చైతన్యుని వరకు గల వైష్ణవా
చార్యుల జీవిత సిద్ధాంత విషయములు సమీక్షింపబడినవి.
1/8 క్రౌను, 340 పుటలు. 3-25

26. సాధన మకరందము : శ్రీ స్వామివారు 1941లో సంవత్సర
మౌన దీక్షాకాలమున. అన్యులకు వ్రాసిన సమాధాన వచ
నము. సాధన విషయములేగాక అనేక అవసర విషయముల
విచారణ మిందు గలదు. 1/8 క్రౌను, 125 పుటలు. 1-00

27. సర సిద్ధాంత సౌరభము - 9వ సంపుటము :
శైవఖండము - ప్రథమ భాగము - శైవాద్వైతము-వేదముల
నుండి ప్రాదుర్భవించి జనితమైన శైవసిద్ధాంతము వీరశైవమువరకు
ఎట్లు పరిణమించి యున్నదియు నిట స్పష్టము. నాయనారుల
జీవితములు గలవు. 1/8 క్రౌను, 330 పుటలు. 3-25

28. సర సిద్ధాంత సౌరభము - 10వ సంపుటము :
శైవఖండము - ద్వితీయ భాగము - శాక్తాద్వైతము -
వేదాంతర్గత దేవీసూక్త అదితి ప్రస్తావనములతో ప్రారంభమై,
దక్షిణ, వామాచార రూపమున సర్వత్ర ప్రఖ్యాతి నొందిన
శాక్త సిద్ధాంత సాధనములతో వివరింపబడినది.
1/8 క్రౌను, 450 పుటలు. 4-2

29. సర సిద్ధాంత సౌరభము - 11వ సంపుటము :
బౌ ఖండము - ప్రథమ భాగము - బౌద్ధ సిద్ధాంతము.
అచ్చులో